## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **మోహన్ పబ్లికేషన్స్** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **మోహన్ పబ్లికేషన్స్** వారి వెబ్ సైట్: http://www.mohanpublications.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **మోహన్ పబ్లికేషన్స్** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## మోహన్ పబ్లికేషన్స్ వారి వెబ్ సైట్:

http://www.mohanpublications.com/



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వివాహ మంత్రార్థం

## కళ్యాణ వీణ (వాణి)

సృష్టిలో దాంపత్యం అపూర్వమైంది. జీవరాశులందరికీసమానంగా వర్తిస్తుంది. భారతీయ ఆర్షధర్మము ఒక ప్రత్యేక సంస్కారం. జీవితం సుఖశాంతులతో వర్ధిల్లడానికి యిది ఎంతో దోహదం గావిస్తుంది.

ప్రతి మనిషి పుట్టుకతోనే మూడు ఋణాలతో జన్మిస్తాడు. ఆ ఋణాలు ఆతడు తప్పక తీర్చాలి.

**1. దేవ ఋణము :** నీరూ–నిప్పు–తన పరిసరాల దేవతలకూ, వర్షాలు వర్షించే ఋతువులకూ మొదటి ఋణము తప్పకుండా తీర్చాలి.

**2. పితృణము :** సకల జీవుల పుట్టుకకు అంకురము దీన్నే ఆ దానమని అంటారు. విరాట్ పురుషుని భాగాల్లో మనిషి తన బాధ్యతను సక్రమరీతిలో నెరవేర్చుకొనాలి.

**3. ఋషి ఋణము :** ఎప్పుడీ సృష్టి ప్రారంభింపబడిందో, సకల శాస్త్ర విజ్ఞానులూ తానీవిధంగా జీవించడానికి సకల సుఖ సంతోష మార్గాలను చూపించారు. అందుచేత వారలకు ఋణపడి ఉన్నాడు. అందువలన తానూ విద్యార్జన మొదలైన సాధనాలకు కృషి గావించాలి.

యిలా మానవుడు మూడు ఋణాలు తప్పక తీర్చాలి. యిందులో రెండవది పితౄ ఋణము తీర్చే సంస్కారాన్ని వ్రాయాలి. యీ కానుపించు ప్రకృతిని నడిపించడానికి సర్వ జీవరాశులే సాధనా మౌతాయి. యిదంతా ప్రకృతే చేస్తుంది. స్త్రీ పురుషులందున్న పరస్పర ఆకర్షణను పూర్వ మహర్షులు వివాహాన్నే "ఒక గంధర్వు" దన్నారు. యీ గంధర్వ శక్తి "సోము"దనే గ్రహాకర్షణ శక్తిపై ఆధారపడింది. యీ సోముడు యీ భూమికి ఉపగ్రహ



చంద్రుని వలన భూమ్మీద జీవులపై వ్యాపించి వయసూ, అందమూ, ఆకర్షణ మొదలైన వాటిని కలిగిస్తుంది.

యీ మనోధర్మాలు ప్రకృతి ద్వారా పరమార్థాన్ని సాధించడానికి మనువూ మొదలైన మహర్షులు సంస్కార మార్గాన్ని చెప్పిన పవిత్ర మహాశక్తే వివాహం. సంస్కారం లేని వారికి గంధర్వ శక్తియగు "కామము" బలవంత దాంపత్యము వలన రోగాది దుఃఖాదులకు కారణం. యీ గంధర్వ శక్తినే "కామము" అన్నారు. మనస్సునకు కామము పడితే చెప్పనలవి కాని చెడు జరుగుతుంది. మనవేద మహర్షులు మానవుల దాంపత్యానుభవానికి వారిచ్చు బహుమతే కామము. సృష్టి కార్యానికి సంతానమనే దివ్యయజ్ఞ కర్మమే కామము. అంతేకాని యింద్రియలోలత్వానికి కారణం కారాదు. పూర్వము స్త్రీ పురుషుల దాంపత్య కర్మ ఒక గొప్ప యాగముగా నుండి గ్రహాలు నిర్ణయించే నియమిత కాలములోనే జరిగేది. స్త్రీ పురుషులు స్నేహితుల్లాగ సర్వ కార్యాలూ చేసికొనేవారు. గృహస్థం సంతానం కొరకు ఒక మహత్తరముగా యేర్పాటు చేయుబడిన యాగము.

అందుకే యీ గృస్థాశ్రమము నాలుగాశ్రమములలో ఉత్తమమైనదిగా మహర్షులు నిర్ణయించారు. స్త్రీకి పాతివ్రత్య ధర్మము పురుషునికి ఏకపత్నీ వ్రతము నిర్ణయించారు. శరీరం శుక్ల శోణితాల నిర్మాణము వలననే జరుగుతుంది. అందువలన ఆ రెండూ పవిత్రములైన యిరువురి శరీరాలు ఆరోగ్యవంతాలై, శాంతితో సుఖముతో మనగలుగుతాయి. బ్రహ్మచర్యముతో గురుని దగ్గర సర్వ శాస్త్రాలూ అభ్యసించాలి. "ఉపనీయ గురు శ్శిష్యం శిక్షయేత్ శౌచమాదితః" (మనుధర్మ శాస్త్రము).

బ్రహ్మచారి స్నానాద్యనుష్ఠానాలు క్రమముగా నిర్వహించడం. తన బట్టలు తానే ఉతికికొని గురుని బట్టలు కూడా ఉతికి గురు శుశ్రూష గావించడం పదిహేను సంవత్సరాలకు వేదమంతా ఉపనిషద్ వ్రతము చేయించాలి. తైత్తిరీయంలో దీనికి ప్రతి క్రియ ఉంది. వేదము 4 భాగాలు **1. సంహిత 2. ఉపనిషత్తు 3. అరణ్యకము 4. బ్రాహ్మణము** యివేకాక వివాహాదులకు ఉపయోగించు మంత్రాలన్నీ వేరొక గ్రంథంలో ఉంటాయి.



## కన్య నెంచుట



ఇవి పది విధాలు

**1. గుప్త :** మాతా పితలు మొదలగువారి సంరక్షణములో నుండటం దీనిని గుప్త కన్యగా చెప్పబడుతుంది.

**2. శరీరం మోటు :** జుట్టు యెద్దు వంటిది. కనుబొమ్మలు రెండూ కలిసి ఉండటం. మగ కంఠధ్వని, నవ్విన నేత్రాలు మూతపడటం దుశ్శీలాదులు కలవారౌతారు.

**3. శరభ :** అధిక కామము, సౌందర్యం, పురుషాకర్షణ గల శరీరం వేశ్యవలె కానుపించిన కన్య.

**4. వినత :** నడుమువంగుట, వృద్ధవలె నడక గర్భవ్రాతాదులతో అనారోగ్యం గల కన్య.

**5. వికట :** బలిష్ఠముగా, కాకివంటి పిక్కలు, కొంగవంటి కాళ్ళు, ఒంటె వంటి కాళ్ళు గలది. యిది ఎంతో దారిద్ర్యాన్ని అనుభవిస్తుంది. భర్తకూ–బిడ్డలకూ దూరంగా ఉంటుంది.

**6. మండూషిక :** గరుకుతో మృదువుగాని శరీరము గలది. బాగా పొట్టిగా మరగుజ్జు గల కన్య.

**7. ముండ :** ఎన్నో కారణాల వలన తలబోడిగా చేయించుకొన్నది.

**8. సాంకరిక :** ఏ జాతో తెలియనిది. అనేక రకాల సంప్ర దాయాలున్న యింటిలో పుట్టిన కన్య.

**9. రత :** దుష్టాచార గృహమున జన్మించినది. విపరీతమైన కామము గలది. చెడ్డ ప్రవర్తన గలది. కామోద్రేకాలను కలిగించు గ్రంథాలను చదివిన కన్య.

**10. పాలి :** దాసీ వృత్తికి సంబంధించిన పిల్లలను పెంచటము మొదలైన పనులు చేయు కన్య.

వీరెవరూ వివాహానికీ పనికి రాదని ఆపస్తంభ మహర్షి వ్రాశాడు.



## వివాహానికి ప్రధానాలు

**1. సమా వర్తనము :** గురుకులమున సమస్త విద్యలూ సర్వ విద్యలు నేర్చికొని గురువు అనుమతితో వచ్చిన బ్రహ్మచారిని స్నాతకు డంటారు.

**"వేదమనూచ్య ఆచార్యో అంతే వాసినం అనుశాస్తి"**

తా॥ వేదాన్ని వల్లించిన శిష్యుని గురువు యిలా ఆజ్ఞాపించును.

**"సత్యం వద"** సత్యమునే పలుకుము.

**"ధర్మం చర"** ధర్మాన్ని ఆచరింపుము.

**"స్వాధ్యాయాన్ మా ప్రమదః"** వేదాన్ని వల్లించడములో అత్యంత శ్రద్ధచూపు.

**"మాతృదేవోభవ"** తల్లియే దైవమని తెలుసుకొమ్ము.

**"పితృదేవోభవ"** తండ్రియే దైవమని తెలుసుకొమ్ము.

**"ఆచార్యదేవోభవ"** గురువు దేవుడని తెలుసుకొమ్ము.

**"అతిధిదేవోభవ"** అతిథే దైవమని తెలుసుకొమ్ము.

**"యాని అస్మా అస్మాకం సుచరితాని తాని త్వయా ఉపాస్యాని"** మాయందుగల మంచినడవడి యేది ఉందో వాటినే నీవు నేర్చికో.

**"ఏష ఆదేశః"** యిది మా ఆదేశము.

**"ఏష ఉపదేశః"** యిది మా ఉపదేశము.

యిలా బ్రహ్మచారి సర్వశాస్త్రార్థ వినోదియైన శిష్యునకు ఆచార్యుడు హృదయ పూర్వకముగా ఉపదేశించి, పై విషయాలన్నీ తూచా తప్పకుండా జీవితాంతం ఆచరింపమని శాసిస్తాడు కూడా!

బ్రహ్మచారిని "కాశీకి పంపుట" అనే రూపంలో కన్యాదాత మంచి వరుని చూసి తన కుమార్తెను అగ్ని భగవానుని సాక్షిగా వివాహం గావించు కొమ్మని కోర్తాడు.

వధూవరు లిద్దరూ మంగళ స్నానాదు లాచరిస్తారు. విఘ్నేశ్వరుని పూజ వరుడు, వధువు మంగళ గౌరీ పూజను వివాహాన్ని ముందుగా జరిపించి బ్రహ్మ సశాస్త్రీయంగా జరిపిస్తాడు.

సుముహూర్తం తరువాత దర్భలతో వరుడు కన్య కనుబొమ్మల మధ్య స్పృశించి గృహలక్ష్మీ ఘన సంస్కారాన్ని గావిస్తారు.

## ఆచమనీయం

ఓం కేశవాయ స్వాహా
ఓం నారాయణాయ స్వాహా
ఓం మాధవాయ స్వాహా
ఓం విష్ణవే నమః
ఓం మధుసూదనాయ నమః
ఓం త్రివిక్రమాయ నమః
ఓం వామనాయ నమః
ఓం శ్రీధరాయ నమః
ఓం హృషీకేశాయ నమః
ఓం పద్మనాభాయ నమః
ఓం దామోదరాయ నమః
ఓం సంకర్షనాయ నమః
ఓం వాసుదేవాయ నమః
ఓం ప్రద్యుమ్నాయ నమః
ఓం అనిరుద్ధాయ నమః
ఓం పురుషోత్తమాయ నమః
ఓం అధోక్షజాయ నమః
ఓం నార సింహాయ నమః
ఓం అచ్యుతాయ నమః
ఓం జనార్ధనాయ నమః
ఓం ఉపేంద్రాయ నమః
ఓం హరయే నమః
ఓం శ్రీ కృష్ణాయ నమః

**పృథివ్యాః, మేరో వృష్ఠః ఋషిః, కూర్మో దేవతా, సుతలా ఛందః, ఆసనే వినియోగః**

**ప్రణవస్య పరబ్రహ్మ ఋషిః పరమాత్మా దేవతా, దైవీ గాయత్రీ ప్రాణాయామే వినియోగః**

## ప్రాణాయామము

ఏడు వ్యాహృతులు మొదలు చెప్పి బొటన వ్రేలితో కుడివైపు ముక్కును మూసి ఎడమ ముక్కుతో గాలిని తీయాలి.

ఏడు వ్యాహృతులు – **ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః ఓం జనః, ఓం తపః, ఓం సత్యం.**



యిలా గాయిత్రీ జపాన్ని గావిస్తూ, పీల్చిన గాలిని లోనిలపాలి; యిదే ॥కుంభకము.

గాయిత్రి – **"ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయో నః ప్రచోదయాత్"**

**శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థే** = శుభే శోభన ముహూర్తే = పరమేశ్వర ఆనందం కొరకు శుభము, శోభన ముహూర్తాన,

**అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే** = ఇప్పుడున్న బ్రహ్మ యొక్క రెండవ పదార్థమందు;

**శ్వేత వరాహకల్పే** = తెల్లని పంది చిహ్నము గల కల్పాన;
**వైవస్వత మన్వంతరే** = వైవస్వతు మనువుకాలాన;
**కలియుగే ప్రథమ పాదే** = కలియుగ మొదటి నాల్గవ భాగాన;
**జంబూ ద్వీపే** = జంబూ ద్వీపాన;
**భరత వర్షే, భరతఖండే** = భారత వర్షమున, భరతఖండములో;
**మేరోః దక్షిణ దిగ్భాగే** = మేరువు పర్వతానికి దక్షిణమున;
**శ్రీశైలస్య** = శ్రీశైలానికి ఈశాన్య–శ్రీశైలానికి – దిక్కున
గోదావరి నద్యో ప్రాక్తతన – గోదావరికి తూర్పున
**స్వగృహే** = వసతి గృహమున;
**సమస్త దేవతా బ్రాహ్మణ సన్నిధౌ** = సమస్త దేవతలూ, బ్రాహ్మణుల సన్నిధిలో;
**అస్మిన్ వర్తమానే** = ప్రస్తుతం జరుగుచున్న;

**వ్యావహారిక చాంద్రమానే** = ప్రస్తుత చాంద్ర మాసాన సంవత్సరే –ఆయనే–ఋతౌ–మాసే–పక్షే–తిథౌవాసరే యోగే–కరణే ఏవంగుణ విశేషణ విశిష్టయాం–శుభతిథౌ–అస్మాకం = మాకు; సకుటుంబానాం = కుటుంబ మందరికీ;

క్షేమ స్థైర్య విజయ ఆయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం – క్షేమ, స్థిర



– సర్వకార్య విజయ ఆయువు – ఆరోగ్య ఐశ్వర్యాలు పెంపొందుటకు;

**ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం** = ధర్మ అర్థ – కామ – మోక్షాలు మానవుని ప్రయోజనము కొరకు

**సమస్త మంగళా వ్యాప్త్యర్థం బ్రహ్మచర్య వ్రతలోప ప్రాయశ్చిత్తం కరిష్యే** = సకల శుభాలందడానికి; బ్రహ్మచర్య వ్రతమున యేదేని లోపమున్న; ప్రాయశ్చిత్తము చేసికొందును.

యీ సంకల్పము అనంతరం సభవారికి నమస్కరించాలి.

## సువర్ణ మణి భూషణాలు దాల్చుట

యీ దిగువ గల మహా మంత్రాలను చదువుతూ మణిహారాలు దాల్చాలి.

**ఆయుష్యం, వర్చసం రాయస్పోష మౌద్విదం** = ఆయువు, కాంతి కలిగించునదీ, ధనము శరీర పుష్టిని, సంపదల నిడునది;

**ఇదం హిరణ్యం వర్చస్వ జైత్రాయా మాం** = యీ బంగారము కాంతీ, విజయము కలిగించుటకు నా యందుండు గాక!

**ఉచ్ఛైర్వాజీ పృతనాషాట్ సభాసాహం ధనంజయం సర్వాన్ సమగ్రా బుద్ధయా హిరణ్యేస్మిం త్వమాహితాః** = యీ బంగార మందు యుద్ధమున విజయము, సభలో వాక్పటిమ, ధనమూ, అన్ని విధాలా అభివృద్ధి మంచి వేగముతో నున్నది.

**శున మహం హిరణ్య స్వపితుర్నా మేవ జగ్రభ** = పితృదేవుని నామమువలె హిరణ్య కిరణాన్ని నేను తీసికొందునుగాక!

**లక్ష్మీ రాష్ట్రస్య యా ముఖేతయా మా మింద్ర సంసృజ** = ఓ మ హేంద్రా! రాష్ట్రము వలన వచ్చిన లక్ష్మిని నాకీయుము.



**అగ్నేః ప్రజాతం పరియద్ధిరణ్య మమృతం జజ్ఞే అధి మర్త్యేషు** = అగ్ని దేవుని నుండి పుట్టి చుట్టూ తిరుగుతూ ఏ బంగారం మానవులందరిలో నుండి అమృతాన్ని ఇస్తుందో!

**య ఏన ద్వేదస ఇ దేన దర్హతి జరామృత్యుర్భవతి యో బిభర్తి** = ఏ బంగారం పాపాన్ని మాపి జరా మృత్యుహారియై మనలను రక్షించు చున్నదో!

**యద్వేద రాజా వరుణోయదు దేవి సరస్వతీ** = దీనికిని రాజువలె వరుణ, దేవుడు, సరస్వతి దేవీరూపమున;

**ఇంద్రో యద్వృత్రహావేద** = వృత్రాసురుని సంహరించిన వారి రూపాన మహేంద్రుడు తెలియుదురో

**తన్మే వర్చస ఆయుషా** = ఆలాటి బంగారం నా తేజస్సును, ఆయువును కూర్చుగాక!

**నత దక్షాంసి న పిశాచా శ్చరంతి** = రక్కశ, పిశాచాదులు యే మీ చేయకుండుగాక!

## కాశీ యాత్ర

**చరిత బ్రహ్మ చర్యో కృతవ్రత చతుష్టయః కాశీయాత్రాం గమిష్యామి; అనుజ్ఞాం దేహిమే శుభాం** = బ్రహ్మ చర్యముతో, నాలుగు వ్రతాలొనరించి అనంతరం కాశీయాత్ర చేయనున్నాను. నాకు శుభానుమతి నొసగండి. (కన్యాదాత కుమారుడీతనికి ఎదురు వచ్చి యిలా కోరాలి) సాలకారాం **మమ సుతాం దాస్యామి, తే ద్విజః పాణిం గృహీత్వా సాగ్నిః త్వం గచ్ఛస్వ; ఆగచ్ఛ మద్గృహం** = నా పుత్రికను సమస్తాలంకారాలతో ద్విజుడా నీకిస్తాను. అదేవుని సాక్షిగా ఆమె హస్తాన్ని పట్టుకొని నీవు వెళ్లుము. యిప్పుడు మా గృహానికి రమ్ము. యిలా కోరగా జోడు విడిచి తన సామానంతా ఉంచి దర్భలు తీసికొని కూర్చొనాలి. అగ్ని దేవునకు యిలా నమస్కరించాలి.

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

## దీక్షా వివాహం

**స్మృతంచమే, అస్మృతం చమే తన్మ ఉభయం వ్రతం** = నేను స్మరించేది; స్మరించకున్నది.

**నిందా చ మే అనిందా చ మే తన్మ ఉభయ వ్రతం** = నిందించినదీ, నిందలేనిదీ

**విద్యా చ మే అవిద్యా చ మే తన్మ ఉభయ వ్రతం** = విద్య అ విద్య

**శ్రద్ధాచమే - అశ్రద్ధాచమే తన్మ ఉభయంవ్రతం** = శ్రద్ధ - శ్రద్ధ లేనిది;

**ప్రజ్ఞాచమే - అనిష్టం చమే తన్మ ఉభయం వ్రతం** = యిష్టమగునది, అయిష్టమైనది.

**దత్తం చమే, అదత్తం చమే తన్మ ఉభయంవ్రతం** = యీ యబడినది; యీయడానికి వీలు లేనిది;

**అధీతం చమే అనధీతం చమే తన్మ ఉభయంవ్రతం** = చదివినది, చదవనది;

**కృతం చమే, అకృతం చమే తన్మ ఉభయంవ్రతం** = చేసినట్టిది చేయనట్టిది.

**సత్యం చమే, అసత్యం చమే తన్మ ఉభయవ్రతం** = నిజము, అబద్ధము;

**శ్రుతం చమే, అశ్రుతం చమే తన్మ ఉభయంవ్రతం** = వినినది, విననిది.

**వ్రతం చమే, అవ్రతం చమే తన్మ ఉభయంవ్రతం** = అనుష్ఠానంగావించింది గావింపనది యీపైవన్నీ నాకు తప్పని వ్రతాలు. యీ జంటలలో గల మంచివాటిని ఆచరించి, చెడ్డవి విడిచి వ్రతాన్ని నేను ఆచరిస్తాను.



## యజ్ఞోపవీతాన్ని ధరించడం

**న నక్తం స్నాయాం** = చీకటిలో స్నానము చేయను.

**న నగ్నః సాయాం** = బట్టలేకుండా స్నానము చేయను.

**న నగ్నాం స్త్రియం ఈ క్షేయం అన్యత్రమైధునాత్** = ధర్మపత్నితో కలసినప్పుడు కాక స్త్రీని వస్త్రము లేకుండా చూడను.

**వర్షతి నాధావేయం** = వర్షములో తడియను.

**న వృక్షమారోహేయం** = చెట్టెక్కను.

**న కూపమవరోహేయం** = నూతిలో దిగను.

**న బాహుభ్యాం నదీం తరేయం** = నదిని ఈదుకొని దాటను.

**న సంశయ మభ్యాపద్యేయం** = ప్రమాదాలలోనికి వెళ్లను.

యిలా స్నాతకుడు గురుదేవునికి ప్రమాణ మొనరించి శ్రీ గురువునామాన్ని మూడుమారులు హృదయపూర్వకముగా ధ్యానించి

**హే! వాసుదేవా, గార్హస్థ్యం వత్స్యామో భోః** = ఓ వాసుదేవా మహానుభావా! నేనింక నీయాజ్ఞను గృహస్థాశ్రమమును స్వీకరింతును.

## సులక్షణ కన్య

**లక్షణ్యోవరో** = మంచి లక్షణములు గలవరుడు

**లక్షణవతీం** = సాముద్రిక సలక్షణవతిని

**యవీయసీం** = మంచి శరీరముగలదానిని

**భ్రాతృమతీం** = సోదరులు, అక్క చెల్లెళ్లు గలదానిని



**అసపిండాం** = సోదరుల వరుసగల మగవారి కుటుంబాన జన్మించినది

**అగోత్రజాం** = సగోత్రము కానిదానిని

**మాతృతః,పితృతః, చశ్వశ్రు మాతృపుత్రీభావ మనాపన్నాం** = తల్లి వారలు,సోదరి, తల్లి కూతురు వరసలు కానిదానిని

**నివృత్తేపి సాపిండియే** = సోదర వర్గపు ఋషులాదులు లేకపోయిననూ **తధావిధాయ; భార్యాయాఃస్వసురపత్యం** = అటువంటి సోదరీ సంతానముకాని

**పితృవ్య పత్న్యాస్వసారం** = తండ్రి వరుసగనున్న భార్యల సోదరిని

**తథా సపత్నీమాతుః తయో రపత్యంచహిత్వా** = సవతి తల్లి వైపున, అలాంటి వావిగల వారి సంతానాన్ని వీడి,

**అపూర్ణదశవర్షా** = పది సంవత్సరాలు రానిదానిని

**కన్యాముద్వహేత్** = కన్యను వివాహం చేసుకోవాలి.

## మహాసంకల్పం

యీ మహా సంకల్పాన్ని తప్పక చెప్పితీరాలి.

**అథ అనంత వీర్యస్య భగవతో మహాపురుషస్య శ్రీమదాదినారాయణస్య** = అనంత మహాశక్తి గల భగవానుడు, మహాపురుషులు శ్రీ ఆదినారాయణుని యొక్క

**అచింత్యాపరిమిత శక్త్యా ధ్రియమాణస్య** = ఊహకందని, అపరిమితమైన శక్తిచే భరించుచున్న.

**మహాజలౌఘస్య మధ్యే** = గొప్ప సముద్ర మధ్యమున

**పరిభ్రమమాణానాం** = తిరుగుచున్న



**అనేకకోటి బ్రహ్మాండానాంఏకతమే** = ఎన్నోకోట్ల బ్రహ్మాండము లందు ఒకేదానిలో

**వ్యక్తా** = వ్యక్తమైన

**మహదహంకార పృధివ్యాప్తేజో వాయ్వాకాశా ద్యావరణైః ఆవృతే** = వ్యక్తమై, వ్యక్తముకానిదైన మహత్తు, అహంకారము భూమి, తేజము, వాయువు, ఆకాశము మొదలైన ఆవరణలతో కప్పబడిన

**అస్మిన్ మహతి బ్రహ్మాండ ఖండయోః మధ్యే**=మహాబ్రహ్మాండ తునుక మధ్యలో

**ఆధారశక్తి,శ్రీకూర్మ,వరాహ,వైష్ణవానంత,నాగ,శేషతక్షకాష్టదిగ్గజోపరి ప్రతిష్ఠితే** = ఆధారశక్తి శ్రీకూర్మము, వరాహము, వైష్ణవము, అనంత, నాగ, శేష, తక్షక, ఎనిమిదిదిగ్గజాలు, అనే యీశక్తులకు పైన నిలిచినట్టి,

**అతల,వితల,సుతల,తలాతల,రసాతల,మహాతల,పాతాళ సప్తలోకానాం ఉపరితలే** = అతలము మొదలు క్రింది లోకాలు యేడూ;

**భూర్భువ,స్సువ,ర్మహ,ర్జన,స్తప,సత్యమితిసప్తలోకానాం,అధోభాగే** = భూలోకము నుండి పై లోకాలు ఏడును క్రింది ఉన్నవిగను;

**చక్రవాళశైల మధ్యగత మహాసుమేరోః సహస్రశిఖారానువర్తిని, మహానాళాయ మాన ఫణిరాజ రాజస్య,శేషస్య,సహస్రఫణా మణి మణిమండల మండితే** = చక్రవాళ పర్వతము మధ్యలో మేరుగిరి శిఖరాల చుట్టచుట్టి నాళము లాగున్న సర్పరాజు శేషుని వేయి పడగల మణుల మధ్య అలంకరింపబడ్డ;

**ఐరావతి,పుండరీక,వామన,కుముదంజన,పుష్పదంత,సార్వభౌమ, సుప్రతీకాఖ్యాష్టకదిగ్దంతి శూదాదండోత్తంభితే** = ఐరావతాది అష్టదిగ్గజాలు తొండాలతో యెత్తగా నిలిచియున్న;

**అమరావతి,అశోకవతి,అంభోవతి,శైవతి,సిద్ధవతి,సాధ్వవతి,గాంధర్వవతి,**

**అలకావతి ఇతి అష్టాపుణ్యపురీ విరాజితే** = అమరావతి మొదలైన అష్టపురాలతో వెలుగుచున్న;

**ఇంద్రాగ్నియమని ఋత వరుణ,వాయు,కుబేర యాశాన అష్టదిక్పాల పరిపాలితే** = ఇంద్రాది ఎనిమిది దిక్కుల అధిపతులు పాలించునట్టి;

**మహేంద్ర,మలయ,సహ్యశక్తి,హిమవత్,ఋక్షవత్, వింధ్య, పారియాత్ర, సప్తకులాచల, మతంగ, హిరణ్యశృంగ, మాల్యవత్, కిష్కింధ ఋష్య శృంగాఖ్య లోకాఽలోక అచల పంచ మహానగాధిష్ఠితే** = మహేంద్రాది గిరికులా యేడింటి చేత నున్నట్టిదియు;

**రామ-శిబి-రంతి-గయ-అంగ-సుహోత-పృథు-మాధాతృ-యయాతి-మరుత్-దిలీప-భరత-అంబరీష-శశిబిందు-భగీరథ-పరశురామ- ఇతి షోక్షడశ మహారాజైః పరిపాలితే** = శ్రీరాముడు మొదలగు పదునార్గురు మహారాజులచే పాలింపబడినట్టి;

**కార్తవీర్య,సగర,పురూరవ,పురుకుత్స,నల,హరిశ్చంద్రాదిషట్చక్రవర్తిభిః** = కార్తవీర్యార్జునుడు మొదలైన ఆరుగురు చక్రవర్తులచే నున్నట్టి;

**అంగ-వంగ-కళింగ-కాశ్మీర-కాంభోజ-సౌవీర-సౌరాష్ట్ర-మహారాష్ట్ర-మగధ-మాళవ-నేపాళ-కేరళ-చోళ-పాంచాల-గౌడ-మళయాళ-సింహళ-ద్రావిడ-కర్ణాటక-నాట-కర్వాటి-మార్వాటి-పానాట-వాట-పాండ్య-పుళింద-ఆంధ్ర-హూణ-దశార్ణవ-భోజ-కుకురు-కురు-గాంధార-విదర్భ-విదేహ-బాహ్లిక-బర్బర-కేకయ-కోసల-కుంతల-కిరాత-శూరసేన-నేవన-కోంకణ-టెంకణ-మత్స్య-మద్ర-పార్శ్వ-ఘూర్జర-యవన-జాలఅంధక-సాళ్వ-చేది-సింధూవత్యాది అనేక విశేష దేశభాషా భూమిపాలకచిత్రితే** = అంధ్ర మొదలైన దేశాల పరిపాలించు వారున్నట్టి;

**భాగీరథీ-గౌతమీ-నర్మదా-యమునా-సరస్వతీ-కృష్ణవేణీ-బహుదా-భగీరథీ-తుంగ-భద్ర-రేణుకా-మలాపహారీ-కావేరీ- కృతమాలా-**



**తామ్రపర్ణీ-విశోకా-కౌశికీ-గండకీ-విచిత్రకా-వశిష్ఠ-పువరా-కాశ్యపి-సరయూ-సర్వపాపః-కుశావతీ-ఫల్గునీ-రేవా-కరతోయా-పుణ్యాతాది అనేక పుణ్యనదీ పవిత్రతే** = భాగీరథీ మొదలైన పవిత్రనదుల తీర్థముచే పుణ్యముగనినట్టి;

**అయోధ్యా-మధురా-మాయా-కాశీ-కాంచీ-అవంతికా-ద్వారవతీతి సప్త పుణ్య పురీవిరాజితే** = అయోధ్యా మొదలైన పుణ్యక్షేత్ర సప్తకముతో నున్నట్టి;

**స్వామి పుష్కరత్రయ సహిత శేషాచల నగర గుల్మలద్వయ సహిత శ్రీశైలాది పుణ్యతీర్థ పుణ్యాచలాధిష్ఠితే** = స్వామి పుష్కరిణిలో ఉన్న శేషశైలాదులు పుణ్యతీర్థాలుతో కూడినట్టి;

**జంబూ-ప్రక్ష-శాల్మల-కుశ-క్రౌంచ-శాక-పుష్కరాఖ్య సప్త ద్వీప దీపితే** = జంబూద్వీపము కాగల సప్తద్వీపములచే వెలిగినట్టి;

**ప్రత్యేకం నవసహస్రయోజనవిస్తృతే** = ప్రత్యేకముగా తొమ్మిది వేల యోజనాల విస్తీర్ణమున్నట్టి;

**భారత-కింపురుష-ఇలావృత-కురు-భద్రాశ్వ-రమణక-హిరణ్యక-కేతుమాలా-వరాఖ్యా ఇతి నవఖాండమండితే** = భారతఖండము మొదలు నవఖండాలతో యొప్పినట్టి;

**దండక-వింధ్యక-చంపక-బదరిక-నహుష-నైమిశ-ద్వైత-గుహా-దేవదారు-శ్వేతాఖ్యా ఇతి దశారణ్యయాతే**= దండకారణ్యము మొదలైన దశ అరణ్యాలతో కూడియున్నట్టి;

**పంచాశత్కోటి విస్తీర్ణ భూమండలే** = ఏబది కోట్ల విస్తీర్ణ భూమండల మున్నట్టి;

**లక్షయోజన విస్తీర్ణ జంబూద్వీపే** = లక్షయోజనాల (యోజనమగా 10 మైళ్ళు విస్తీర్ణము గల జంబూ ద్వీప మున్నట్టి;



**భరతవర్షే** = భారత వర్షములో;

**వివిధ సురతరు క్రీడా విరాజమాన దశదిశా బహుళ పరిమళ పటల భ్రమర ఝుంకార నికర కరంబిత కలకంఠ కూజిత - సనాద కేకీ కుల ముఖరీకృత విజిత సారస్వత స్వన తరుషండ మండితే** = బహుకల్ప వృక్షాలతో విహారంతో పది దిక్కుల కొమ్మలందు పరీమళములను గ్రోలు తుమ్మెదల ఝుంకారాలతో కోకిల కూజితాలతో అందమంది నెమిళ్ల కేకలతో ప్రతి ధ్వని గావింపబడి విజయము వైన అక్షర ధ్వనులతో వృక్షముల గుబురులున్నట్టి;

**అతుల విమల సత్కల ధౌత కల్పతరుచ్ఛాయా విన్యస్త దేదీప్యమాన రత్న సింహాసనస్య ఉపరిస్థితి యంత్రరాశేః శిఖీకృత ద్విజపతా కాయుత యోజనోన్నత కదంబ వృక్ష దీపితస్య మందారస్య ప్రాంతే** = సాటిలేని నిర్మల స్వర్ణకాంతి గల చెట్ల నీడల యందు నిల్చి, కాంతులు వెదజల్లు రత్న సింహాసనమైయున్న యంత్రపై పదునాలుగు కాంతులు గల జెండాలుతో పదివేల యోజనాలు పొడవు గల కడిమి వృక్షాలతో వెలుగు కల్పకము దగ్గర;

**భరత ఖండే** = భరత ఖండమందు;

**ఇదానీంతర వర్తమానస్య అస్యబ్రహ్మణః శత పరిమితస్య ఆయుషో పూర్వార్థం పంచాశద్గత వతి** = ఇప్పుడున్న బ్రహ్మ యొక్క నూరు వత్సరాల ఆయువునందు మొదటి సగము ఏబది సంవత్సరములు గడచిపో;

**అథ ద్వితీయ పరార్ధే ప్రథమ వర్షే ప్రథమ మాసే ప్రథమ పక్షే ప్రథమే అహని** = రెండవ సగములో మొదటి వత్సరాన మొదటి మాసాన - మొదటి పక్షాన - మొదటి దినాన;

**త్రయోదశ ఘటికా ద్విచత్వారింశత్ విఘటికా గత ఏష ద్విఘటి కాయాం** = పదమూడు గడియల నలువది రెండు విఘడియలు జరుగగా ఆపై విఘడియ యందు;



**ప్రథమ ప్రాణా యామకాలే** = మొదటి ప్రాణగతి యొక్క విస్తార కాలమందు;

**పార్థివకల్ప - అనంతకల్ప - కూర్మకల్ప - శ్వేతవరాహకల్ప - ప్రళయ కల్ప - పద్మకల్ప - సావిత్రీ కల్పానాం అన్తర్వర్తి శ్వేత వరాహ కల్పే** = పార్థివ కల్పము మొదలైన తొమ్మిదింటిలో ఒకటవ శ్వేత వరాహ కల్పమున;

**స్వాయంభువ - స్వారోచిష - ఉత్తమ - తామస - దైవత - చాక్షుస - వైవస్వత - సూర్య - అగ్ని - బ్రహ్మ - రుద్ర - దక్ష - రౌచ - భౌచ్య - చతుర్దశ మన్వంతరాణాం అంతః పరిగణిత సప్త సంఖ్యాక వైవస్వత మన్వంతరే** = స్వాయంభువ మనువు దగ్గర నుండి పదునలుగురు మనువుల అంతరమందు ఏడవ మనువు వైవస్వతుని మన్వంతరాన;

**శ్రీమదాది విష్ణోః మత్స్యః - కూర్మ - వరాహ - నారసింహ - వామన - భార్గవ - రాఘవ - కృష్ణ - బౌద్ధ - కల్కి దశావతారాణాం మధ్యే పరిగణిత నవమ సంఖ్యాక శాలివాహన శకే** = శ్రీ ఆది విష్ణువు మత్స్యావతారము, మొదలైన దశావతారాల్లో తొమ్మిదవ బుద్ధావతారాన;

**యుధిష్ఠిర - విక్రమార్క - శాలివాహన - విజయాభినందన - నాగార్జున - కృల్యాణ్య షట్ శకపురుష మధ్యే పరిగణిత తార్తీయ సంఖ్యాక శాలివాహన శకే** = యుధిష్ఠిర శకము నుండి ఆరుశకాలతో మూడవది శాలి వాహన శకమున;

**ఇదానీంతన అష్టావింశ న్మహా యుగే** = ప్రస్తుతము జరుగు ఇరువది యెనిమిది వేల సంత్సర పరిమితి గల కృత యుగము తరువాత;

**అష్టావింశ త్సహస్రాన్విత సప్తదశ లక్షయుత కృతయుగేయాతే** = పదునేడు లక్షల యిరువది యెనిమిది వేల సంవత్సరాల పరిమితి గల కృతయుగము తరువాత;





ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

**పుణ్ణవతి సహస్రాన్విత ద్వాదశ లక్షాబ్ద యుక్త త్రేతా యుగే యాతే** = పదిరెండు లక్షల తొంబది యారు వేల సంవత్సరాలు గల త్రేతాయుగము తరువాత;

**చతుష్షష్టి సహస్రాన్విత అష్ట లక్షాబ్ద సహితే ద్వాపర యుగే యాతే** = ఎనిమిది లక్షల అరువతి నాలుగు వేల వత్సరాలు గల ద్వాపర యుగము తరువాత;

**ద్వాత్రింశ త్సహస్రాన్విత చతుర్లక్షాబ్దే కలియుగే** = నాలుగు లక్షల ముప్పది రెండు వేల వత్సరాలు గల కలియుగ మందు;

**ప్రథమ పాదే** = మొదటి పాదమందు;

**జంబూ ద్వీపే – భరత వర్షే – భరత ఖండే – మేరోః దక్షిణ దిగ్భాగే** = జంబూ ద్వీపాన – భారత వర్షాన – భరత ఖండాన – మేరు పర్వతానికి దక్షిణ దిక్కున;

**శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే** = శ్రీశైలానికి ఈశాన్యములో – **మధ్యదేశే శోభనగృహే** = నదుల మధ్య భాగాన శుభగృహాన;

**సమస్త దేవవతా బ్రాహ్మణ సన్నిధౌ** = సమస్త దేవతల బ్రహ్మణ్యుల సాన్నిధ్యమందు;

**అస్మిన్ వర్తమాన్ వ్యావహారిక చాంద్రమానేన** = ఇప్పుడు నడుస్తున్న చాంద్రమాన మందు;

**సంవత్సర – అయనే – ఋతౌ – మాసే – పక్షే – తిథౌ – వాసరే శుభ నక్షత్రే – శుభయోగే – శుభకరణే** = వత్సరం మొదలగు శుభకరణాన;

**ఏంగుణ విశేషణ విశిష్టా యాం సుముహూర్తే – సులగ్నే** = యీ గుణాలతో గల సుముహూర్తాన – మంచి లగ్నాన;

**అహంతు అనాది అ విద్యా వాసనయా – అస్మిన్ సంసారే విచితాభి ర్విచిత్రాసు యోనిషు పునః పున రనేకధా జనిత్వా** = అనాదిగా అ విద్యచే



యీ సంసారాన విచిత్రమగు శరీరాలతో మరల మరల జన్మిస్తూ;

**కేనవా కర్మ విశేషేణ ఇదానీం అస్మిన్ వంశే జాతస్యనా మధేయస్య** = ఏదో కర్మచేత ప్రస్తుతం యీ వంశాన జన్మించి యీ నామము గల

**మమ జన్మాభ్యాసాత్ జన్మ ప్రభృతి ఏతత్ క్షణ పర్యంతం మధ్యే వర్తిని కావే** = నా జన్మ వాసన వలన జన్మించినది మొదలు యిప్పటి దాకా జరుగు కాలాన;

**సంభా వితానాం పాపానాం వాక్పాణి పాద పాయూప స్థానాం పంచానాం కర్మేంద్రియాణాం** = చేసిన పాపాల వాక్కు మొదలైన కర్మేంద్రియాల యొక్కయు;

**త్వక్చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణాం పంచానాం జ్ఞానేంద్రి యాణాం** = చర్మము మొదలు గాగల జ్ఞానేంద్రియాల యొక్క;

**ఏతేషాం ప్రేతకస్య** = వీటిని ముందుకు త్రోయు

**అంతః కరణైః సగోచరైః** = సూస్తున్న అంతః కరణాలచే;

**సంబంధే సతి** = సంబంధించగా;

**సంభావిత** = సంకల్పింప బడ్డ;

**సకల పాప నివృత్తి ద్వారా** = అన్ని పాపాలు పోవుట వలన;

**శ్రీ లక్ష్మీ నారాయణ, ప్రీత్యర్థం** = శ్రీ లక్ష్మీ నారాయణుల సంప్రీతికి.

**సాలాకృత** = సకల అలంకారాలతో;

**స హిరణ్యోదక** = స్వర్ణంతో నీటితో నున్న;

**కన్యాదాన మహం కరిష్యే** = కన్యను ఆదానము చేయుచున్నాను.

**గంగా వాలుకాభిః సప్తర్షి మండల పర్యంతం కృతరాశేః వర్ష సహస్రా వసానే ఏకైక వాలు కాపకర్ష క్రమేణ సర్వరాశి అపకర్ష సమ్మిత కాలే బ్రహ్మలోకే నివాస సిద్ధ్యర్థం** = రేణువులతో సప్తర్షి మండలముదాకా



వరుసగా పేర్వగా నున్న సంవత్సరాలను వేయితో గుణింపగా వచ్చిన వత్సరాలు జరిగిన తరువాత ఒక్కొక్క ఇసుక రేణువు తీసివేస్తూ రాగా ఆ రేణువులు తీసివేసినంత కాలము బ్రహ్మలోకాన నివాసానికి;

**తిలైః సూర్యమండల పర్యంతం కృతరాశేః వర్షసహస్రావసానే ఏకైక తిలాపకర్ష క్రమేణ సర్వరాశి అపకర్ష సమ్మిత కాలే బ్రహ్మలోక నివాస సిద్ధ్యర్థీం** = భాను మండలము వరకూ నువ్వు గింజలను వరుసగా చేర్చ వచ్చిన రాశిని వేయిచేత గుణింపగా వచ్చిన వత్సరాలు తరువాత మరల ఒక్కొక్క నువు గింజను తీయదానికి వలసినంత కాలము బ్రహ్మలోకాన నివసించుటకు;

**యవై గ్రహమండల పర్యంతం కృతరాశేః వర్ష సహస్రావసానే ఏకైక యవాపకర్ష సమ్మిత కాలే బ్రహ్మలోక నివాస సిద్ధ్యర్థం** = గ్రహమండల పర్యయంతము వరకును సన్నని గోధుమ గింజలను వరుసగా పేర్చగా ఆరాశిని వేయిచేత గుణింపగా వచ్చే సంవత్సరాలు జరిగిపోయిన తరువాత ఆ గింజలను ఒక్కొక్కటి తీయగా యెంత కాలమగునో అంతకాలము బ్రహ్మలోకాన వసించుటకుగాను;

**వృషలోమభిః నక్షత్ర మండల పర్యంతం కృత రాశేః వర్ష సహస్రా వసానే ఏకైక లోమాపకర్ష క్రమేణ సర్వరాశి అపకర్ష సమ్మిత కాలే బ్రహ్మలోక నివాస సిద్ధ్యర్థం** = నక్షత్ర మండలము పర్యనము ఎద్దుతోక వెంట్రుకలు పేర్చగా వచ్చే రాశిని వేయిచే గుణింపగా వచ్చే వత్సరాలు అయిపోయిన వెనుక ఒక్కొక్క వెంట్రుకలను వేరుచేయుటకు ఎంతకాలము పడుతుందో అంతకాలము బ్రహ్మలోకాన ఉండదానికి;

**త్రిగుణీ కృత – అగ్నిష్టోమ అతిరాత్ర – ఆప్తోర్యామ – సాంతసన – వాజపేయ – పౌండరీక – అశ్వమేధాది శతక్రతు పుణ్య ఫలా వాప్త్యర్థం** = అగ్నిష్టోమము మొదలగు నూరు విధ యజ్ఞాలలో; ఒక్కొకటి మాడుసార్లు గావించే ఫలాన్ని పొందడానికి;



**మయా సహదశ పూర్వేషాం దశ అపరేషాం మద్వంశ్యానాం పితౄణాం నరకాదుత్తీర్య శాశ్వత బ్రహ్మలోక నివాస సిద్ధ్యర్థం** = వెనుక పదితరాలు – ముందు పదితరాలు నా వంశస్థులు పితరులు నరకమున తరించడానికి బ్రహ్మలోకాన శాశ్వతముగా ఉండుటకుగాను;

**స్వగృహ్యోక్తం ప్రకారేణ సాలంకృత సహిరణ్యోదక కన్యాదాన మహం కరిష్యే** = మా వంశస్తులు ప్రకారము నీరముతో అలంకరింపబడి – బంగారముతో యీయబడ్డ కన్యను దానము చేయుదును గాక!

## వరుని పూజ



**శ్రీ లక్ష్మీ నారాయణ స్వరూపస్య వరస్య ఇదమాసనం** = శ్రీ లక్ష్మీ నారాయణ రూపుడగు వరునకు యిదిగో ఆసనం;

**శ్రీ లక్ష్మీ నారాయణ స్వరూప వర ఉభాభ్యాం ఇదం పాద్యం** = శ్రీ లక్ష్మీ నారాయణ స్వరూపుడగు వరా! నీ పాదాలకు యిదిగో పాద్యం;

**నమోస్తు అనంతాయ సహస్ర మూర్తయే సహస్ర పాదాక్షి శిరోరు బాహవే సహస్ర నామ్నే పురుషాయ శాశ్వతే సహస్ర కోటీ యుగధారిణే నమః** = అనంతునికి, సహస్ర రూపునకు వేయిపాదాలున్న వాశికి – వేయి నేత్రాలు – వేయితలలు – వేయి తొడలు – వేయి చేతులు – వేయి నామాలు ఉన్నవారికి – కిరీటమున్న వానికి, శాశ్వత పురుషునకు నమస్సులు;

**శ్రీ లక్ష్మీనారాయణ వర అమీగంధా** = శ్రీ లక్ష్మీనారాయణ స్వరూప డవగు వరుడా! యిదిగో సుగంధ ద్రవ్యాలు;

**అలంకా రార్థాః ఇమే అక్షతాః సంతు అక్షతాః** = అలంకారానికి యీయబడిన యీ అక్షతలు నీకు అక్షయ సుఖాల నందించుగాక!

**సకలారాధనైః శోభనోస్తు** = అన్ని పూజలచేత నీవు శోభింతువు గాక!



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్,
కోటగుమ్మం,రాజమండ్రి.

## వరుని పాదాలు కడుగుట



**దక్షిణ పాదం అవనే నిజే అస్మిన్ రాష్ట్ర మింద్రియా దధాన** = నీకుడి పాదం మహేంద్రుని అంశగా నారాష్ట్రంలో ధరిస్తున్నాను. (అలాగని వరుని కుడిపాదం కన్యాదానం చేసిన వారు కడగాలి)

**సవ్యం పాద మవనే నిజే అస్మిన్ రాష్ట్రే ఇంద్రియం వర్ధయామ** = నీ వామపాదాన్ని నారాష్ట్రాన్ని ఇంద్రుని అంశగా వరల చేస్తున్నాను; (ఎడమకాలు కడగాలి);

**పూర్వ మన్యం అపరమన్యం పాదావనే నిజేదేవా రాష్ట్రస్య గుప్త్యా అభయస్య అవరుద్ధ్యై ఆపః పాదావనే జనేర్ ద్విషంత నిర్దహంతః మే**= మొదటి కాలు నొకటి – రెండవకాలు ఒకటి రక్షిస్తూ యీరాష్ట్ర దేవతలు అభయ మిచ్చునుగాక?

**ఆపః పాదావనే జనేర్ ద్విషంత నిర్దహంతు మే** = యీ కాళ్ళను రక్షించు దేవతలను స్తుతించి నీ జలము నా శత్రువులను పూర్తిగా కాల్చుగాక!

(యిలాగని రెండు పాదాలూ కడగాలి)

## వరునికి అర్ఘ్య పాద్యాదులిచ్చుట

**"వర ఇద మర్ఘ్యం"** = "వరుడా! అర్ఘ్యమిదిగో!" అని మూడుమారులు అని ఆతని దోసిలందు నీరు పోయాలి;

**"ఇదం ఆచమనీయం"** = "ఇదిగో ఆచమన జలము" అని వరుని హస్తమున మూడు మారులు ఉంచాలి;

**"అమృతోపస్తరణ మసి"** = "అమృతాన్ని యిచ్చువారు మీరు" అని నీటినని త్రాగి వరుడు రెండు మారులు ఆచమనీయం గావించాలి;



**శ్రీ లక్ష్మీనారాయణ స్వరూప వర! అయం తే మధుపర్కః** = "శ్రీ లక్ష్మీనారాయణ స్వరూప వరా! యిదిగో! మధుపర్కం నీకు; అని పలికి కన్యాదాత వరునిచేతికి అందించాలి. యీ మంత్రాన్ని చెప్పాలి.

**దేవస్య త్వా సవితుః ప్రసవే** = దేవుడగు సవిత సృష్టిగావించడానికి;

**అశ్వినోః బాహుభ్యాం** = అశ్వినీ దేవతలకు కావలసిన బాహువులు;

**"పూష్ణే హస్తాభ్యాం"** = "పూష" అనే దేవతలకు చెందిన హస్తాలు;

**ప్రతి గృహ్ణామి** = తీసికొనుచున్నాను.

## కన్యను యిచ్చుట



కన్యాదాత వరునితో యిలా అనాలి;

**కన్యాం కనక సంపన్నాం కనకాభరణ భూషితాం దాస్యామి** = బ్రహ్మలోకాన నేనుండడానికి బంగారు సంపదతో నున్న;

**విష్ణవే తుభ్యం బ్రహ్మలోక జిగీషయా** = బంగారు ఆభరణలతో అలంకరింపబడిన యీ కన్యను నీకు ఇస్తున్నాను;

**విశ్వంభరః సర్వభూతాః కన్యాం ఇమాం** = పితృదేవతలు ఆనందించి తరించడానికి యీ కన్యను;

ప్రదాస్యామి పిత్యాణం తారణాయవై = యిచ్చుచున్నాను. పంచభూతాలు సాక్షిగా;

**కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే ప్రయత్నో2హం ప్రయచ్ఛామి ధర్మ కామార్థ సిద్ధయే** = అలంకారిణి, సాధు శీలవతి యీ కన్యను ధర్మకామార్థము కలుగుటకు నేను సుశీలుడైన యీ వరునకు యిస్తున్నాను.



వధూవరుల మూడు తరాల ప్రవర చెప్పాలి. నీళ్లతో కన్యను వరుని హస్తమున ధారపోయిలి. యీ మంత్రం చెప్పాలి.

**తుభ్యం ప్రజా సహత్వ ధర్మభ్యః ప్రతి పాదయామి** = సంతానం మొదలైన ధర్మకర్మలు గావింప యీమెను నీకు యిచ్చుచున్నాను;

కన్యాదాత **"వృణీధ్వం"** కన్యాదాత **"వరింపవలసింది"** అని పలకాలి;

వరుడు **"వృణీమహే"** "వరించుచూన్నాను" అనాలి.

యీలా యిద్దరూ మూడుసారులు పలుకాలి.

వరుడు : **అశ్వినో ర్భాహుభ్యాం – పూష్ణో హస్తాభ్యాం ప్రతి గృహ్ణామి** = అశ్వనీ దేవతల హస్తాలచేత – పూష చేతులతో యీ కన్యను నేను తీసికొనుచున్నాను;

**రాజా త్వా వరుణచే నయతు** = వరుణ రాజు నిన్ను కొనువచ్చుగాక!

**చేవ దక్షిణే ప్రజాపతయే కన్యాం** = ఓ దక్షిణ దేవీ! ప్రజాపతి వ్రతముకు యీ కన్యను పరిగ్రహించు చున్నాను;

**వయో దాత్రే మయోమహ్యం అస్తు ప్రతి గృహీత్వే** = కన్యాదాతకు నాకూ బంధుత్వం అమరుగాక;

**ఇదం కస్మా ఆదాత్ కామః కామాయ** = యీమెను నాకెవరిచ్చారు? కాముడు కామానికి ఇచ్చాడు;

**కామోదాతా** = యిచ్చినావాడూ కాముడే;

**కామః ప్రతి గ్రహీతా** = పుచ్చుకున్నవాడూ కాముడే!;

**కామం సముద్ర మావిశ** = కామ సాగరాన దిగుము;

**కామేన త్వా ప్రతి గృహ్ణామి** = కోరిక చేత నిన్ను వరించాదు;



## కన్యాదాత యిలా అనాలి



**"ఏతాషే తే కామ దక్షిణా"** = యీమె నీకామము తీర్చును;

**"ఉత్తాన త్వా ఆంగిరసః ప్రతి గృహ్ణాతు"** = ఆంగిరసలు వచ్చి నిన్ను స్వీకరింతురు గాక!

## దక్షిణ యిచ్చి కన్యాదాత యిలా అనాలి

**"కన్యాదాన సాద్గుణార్థం దక్షిణ్యాం తుభ్య మహం సంప్రదదే నమమ"** = కన్యాదానం సద్గుణ మవాలని నీకు యీ దక్షిణ నిస్తున్నాను.

**కన్యాదాన సాద్గుణ్యార్థం సాలగ్రామం తుభ్య మహం సంప్రదదే నమమ** = కన్యాదానము సద్గుణమంద సాలగ్రామము నీకిచ్చు చున్నాను;

కన్యాదాత : **ధర్మే త్వయా ఏషా నాతి చరితవ్య** = ధర్మమున నీవు యీమెను దాటరాదు;

వరుడు : **నాతి చరామి** = అతిక్రమించి చరించను;

కన్యాదాత : **అర్థే త్వయా యేషా నాతిచరితవ్య** = అర్థము నందు కూడా యీమెను మించి చరింపకు;

వరుడు : **నాతిచరామి** = అతిక్రమించను;

కన్యాదాత : **కామే త్వయా ఏషా నాతిచరితవ్య** = కామములో కూడా యీమెను దాటరాదు;

వరుడు : **నాతి చరామి** = అతిక్రమించను;

వరుడు ఆచమనాదులు చేసి కల్యాణ మండపము నందు అగ్నిని ప్రజ్వలింప చేయాలి. మరల యిలా చెప్పాలి.





ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

సకల శ్రౌత స్మార్త నిత్యకర్మానుష్ఠా నాధికార సిద్ధ్యర్థం గృహాగ్ని ప్రతిష్ఠాపనం కరిష్యే = వేద-ధర్మశాస్త్రాల ప్రకారం నిత్య కర్మలను అనుష్ఠింప అధికారము కలగ్గృహములో అగ్నిని ప్రతిష్ఠించుచున్నాను.

## మధుపర్కం



కన్యాదాత సంకల్పం చెప్పిన తరువాత

**మయా క్రియమాణ కన్యాదానం గత్వేన** = కన్యాదానానికి ముందుగా;

**వరం మధుపర్కేణ పూజయిష్యే** = మధుపర్క మొసగి వరుని పూజిస్తాను; అని

**కూర్చం ప్రయచ్ఛతి** = దర్భ కుచ్చుతో మధుపర్కాన్ని ఇచ్చును.

పాద్యాన్ని యిస్తూ

**ఆపః పాద్యాః** = నీటితో పాద్యమిచ్చును

కన్యాదాత వరుని కుడిపాదాన్ని కడుగును. తనపై తీర్థాన్ని జల్లుకొని యిలా అనును.

**మయి మహో మయి యశో మయి ఇంద్రియం వీర్యం** = తేజము కీర్తి - ఇంద్ర వీర్యం నాయందుండు గాక! తరువాత అర్ఘ్య మిచ్చును. కన్యాదాత ఆవునేతితో మోదుగ పత్రాలతో వపా హోమం చేయాలి.

**అగ్ని ప్రాశ్నాతు ప్రథమః సహి వేద యథాహవిః** = అగ్ని దేవుడు మొదట హవిస్సును స్వీకరించుగాక!

**అనష్ట మస్మాకం కుర్వన్ బ్రాహ్మణో బ్రాహ్మణ్యేభ్యః స్వాహా అగ్నయ ఇదం నమః** = బ్రహ్మ రూపాగ్ని యీ బ్రహ్మ రూపులకు - మాకు నష్టము లేనట్లు చేయుగాక! అగ్ని దేవుడు దీనిని తీసికొనుగాక! అగ్నికి నమస్కారం;



**యజ్ఞో వర్ధతాం** = యజ్ఞము వర్ధిల్లుగాక!

**యజ్ఞస్య వృద్ధిం అను వర్షాప చితిః అపి** = యజ్ఞము సంవత్సర మంతా అభివృద్ధి గావింపు;

**మా కురు అపచితోహం మనుష్యేషు భూ యాసం** = యజ్ఞాలు చేసిన వారిలో నేనొకడ నగుదునుగాక! నాకు సమకూర్చుము.

**గౌర్ధేను భవ్యా మాతా రుద్రాణాం దుహితా వసూనాం స్వసా ఆదిత్యానాం అమృతస్య నాభిః** = గోదానమిడి యీ గోవు రుద్రుల తల్లి - వసువుల కూతురు - ఆదిత్యుల సోదరి - అమృతము కేంద్రము.

**ప్రణుచోచన్ చికితుషే జనాయ మాగాం అనాగాం** = నిరపరాధిని అదితి యీ గోవు;

**అదితిం వధిష్ట** = జనుల కోరికలు తీర్చి హింసచే యకుందువు గాక!

**పిబతు ఉదకం తృణాని లిత్తు** = యీ ఆవు మంచి జలము గ్రోలి గడ్డిని మేయుగాక;

కన్యాదాత వివాహానికి వచ్చిన వారందరికీ తృప్తిగా భోజనం పెట్టాలి.

## సుముహూర్తం



**త్రైలోక్య వల్లభాం దివ్యాం గంధ మాల్యాంబరాన్వి తాం సర్వలక్షణ సంపన్నాం సర్వా భరణ భూషితాం అనర్ఘ మణి మాలాభిః భాసయంతీం దిగంతరం విలాసినీ సహస్రాఫ్యై సేవ్య మానా మహర్నిశం - త్రైలోకాలంకార మైనదీ**= దివ్య శక్తులు గలదీ, గంధ మాలాంబ రాలుతో నున్నదీ, శుభ లక్షణములు గలదీ, సార్వా భరణో పేతో, అమూల్యాభరణో పేతా పుణ్యస్త్రీలచే సేవింపబడినదియూ అగు శచీదేవిని పూజింపుము.



**దేవేంద్రాణీ నమస్తుభ్యం దేవేంద్ర ప్రియ భామిని వివాహం భాగ్య మారోగ్యం పుత్ర లాభం దేహిమే** = దేవేంద్రుని పట్టమహిషీ! నీకు నమస్కారం వీరికి వివాహం - ఆరోగ్యం - సంతానం యీయుము.

తెల్లని బియ్యాన్ని పళ్ళెములో వేసి వాటితో యింద్రుని అర్ధాంగిని పూజించాలి. తెల్లని బట్ట మంచి గంధముతో స్వస్తిక్ రూపంగా వ్రాసి తెరవేయాలి. తెర ఉత్తర దక్షిణ దిశలకు పెట్టాలి. బెల్లమూ,జీలకఱ్ఱ కన్య హస్త మందుంచి తెరకు పడమర ముఖముగా కూర్చుండ బెట్టాలి. వరునకు జీలకఱ్ఱ బెల్లమిచ్చి పడమర దిశముగా కూర్చుండ బెట్టాలి.

కన్యా వరుడు యిరువురూ యిష్ట దేవతలను ప్రార్థించాలి. మంగళ వాద్యా నాదాలతో సుముహూర్తం వరకూ ఉండి బ్రహ్మ సూర్య సూక్తాన్ని పఠనగావిస్తుండగా - పుణ్యాంగనలు మంగళ గీతాలు పాడుచుండగా సుముహూర్త సమయాన తెరతీయాలి. వధూవరులు ఒకరి భ్రూమధ్యమును యింకొకరు చూసుకొనాలి. ఒకరి తలపై యింకొకరి హస్తముతో జీలకఱ్ఱ బెల్లం ఉంచాలి. వరుడు యీ క్రింది మంత్రమును పఠించాలి.

అభాతృఘ్నీం వరుణ అపతిఘ్నీం బృహస్పతే ఇంద్ర అపుత్రఘ్నీం లక్ష్మ్యం తామస్యై సవితుస్సః = వరుణా సవిత వెలుగు యీమెను సోదరులకు అభివృద్ధి కలిగించుము. బృహస్పతీ! భర్త అభివృద్ధి కలదానిగా చేయుదువు గాక! ఇంద్రా! యీమెకు పుత్ర సంతానము యీయుము.

**అ ఘోర చక్షుః అపతిఘ్ని యేధి** = మంచి దృష్టితో నున్న నీవు సౌభాగ్య మందుదువు గాక!;

ఉత్తర దక్షిణాలకు కాడి నుంచి దక్షిణపు దాని రంధ్రమందు నీరు చల్లి

**ఖే - అనసః ఖే రథః ఖే యుగస్య శచీపతే** = ఆకాశాన పోలులేని రథమున్న కాడిని నడిపిన శచీపతీ!





## మంగళ సూత్ర ధారణము

ముందుగా సంకల్పించి - శ్రీ మంగళ దేవతకు స్వాగతించి 16 ఉపచారాలతో మంగళ సూత్రాన్ని పూజించాలి. సభలో గల పుణ్య స్త్రీల,కవి-పండితుల చేత దానిని స్పృశింపచేయాలి. వరుడు వధువు గళమున "మంగళ సూత్రధారణ" గావిస్తూ యీ మంత్రాన్ని చదవాలి.

**"మాంగళ్యం తంతునా అనేన మమ జీవన హేతునా కంఠేబధ్నామి సుభగే త్వం జీవ శరదశ్శతం"** = "నా బ్రతుకునకు ముఖ్యమైన యీ మంగళ సూత్రమును కట్టుచున్నాను. నీవు వంద సంవత్సరాలు బ్రతుకుము".

## అక్షతలు వేయుట



బ్రహ్మ వధువు దోసిలందు అక్షతలు పోసి నెయ్యిచల్లాలి. అలాగే వరుని హస్తములో పోసి వధువు హస్తము క్రింద వరుని హస్తముంచి యీ మంత్రాన్ని చదువును.

**కపిలాన్ స్మారయంతు** = కపలావులను తలంతుముగాక!
**బహుదేయం బాస్తు** = ఎన్నో దానాలు గావింతుము గాక!
**పుణ్యం వర్ధతాం** = పుణ్యము వర్ధిల్లుగాక!;
**శాంతి రస్తు - పుష్టిరస్తు** = శాంతి - పుష్టి వచ్చుగాక!
**ఆయుష్య మస్తు ఆరోగ్య మస్తు** = ఆయురారోగ్యాలు కలుగుగాక!
వరుడు వధువు శిరముపై అక్షతలు వేయవలెను.
**ప్రజాపతి స్త్రియాం యశః ముష్కయో రదధాత్ సపం** = ప్రజాపతి వీర్య ద్వయమున స్త్రీయదు తన యశస్సును ధరింప చేసెను.
వివాహంగావించిన బ్రహ్మ వధువుచే వరుని శిరమున అక్షతలు వేయించవలెను. వరునిచే వధువు తలపై అక్షతలు వేయించాలి.



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్,
కోటగుమ్మం,రాజమండ్రి.

తరువాత వధూవరులిరువురూ నాలుగు మారులు పరస్పరము ఒకరిపై ఒకరు అక్షతలు వేసికొనాలి.

**కామేన తారి ప్రతి గృహ్ణామి** = కామము కొరకు యీమెను చేపట్టాను.

పురోహిత బ్రహ్మ

**కన్యా ప్రతి గృహ్ణోతు ప్రజాయై కామః సమృధ్యతాం** = యీ కన్యను వరించి సంతాన కామాన్ని నీవు తీర్చువుగాక!.

## రక్షా బంధనము



వరుని దక్షిణ హస్తానికి వధువు యెడమ చేతికి కట్టి నాల్గవరోజు రాత్రి వాటిని విప్పాలి.

వరుడు : **ఆపయోః రక్ష బంధనం కరిష్యే** = మా వధూవరులము యీ రక్షాబంధనమును కట్టుకొందుముగాక!

పురోహిత బ్రహ్మ వధూవరులిరువురి హస్తములకు రక్షా బంధనము ధరింపచేయాలి. యీ మంత్రం చదవాలి.

**బృహత్సామ క్షత భృత వృద్ధ సృష్టియం త్రిష్టు భౌజః శుభితం ఉగ్రవీరం ఇంద్ర స్తోమేన పంచదశేన మధ్య మిదం వాతేన సగరేణ రక్ష** = ఓ మహేంద్రా 15వ సామబాధల నుండి మమ్ము రక్షించి అభివృద్ధి కలుగుజేయును గాక!

**అది త్రిష్టుప్ చందస్పుతో** = వారికి శక్తి శోభ నిచ్చిసగర మంత్రముచే రక్షింతుముగాక!

యీ క్రింది మంత్రము చదివి వధూవరుల కొంగులు ముడి వేయాలి.

## బ్రహ్మముడి



యీ దాంపత్య సామ్రాజ్యాన్ని దాల్చిన నీకు వరుణుడు రాజు – బృహస్పతి దేవుడు – ఇంద్రాగ్నులు నిశ్చలత్వమం కలుగజేయుదువు గాక!



## వివాహము



యీ క్రింద మంత్రాలతో వధూవరులను పాణిగ్రహణము చేయించాలి. మొదట స్త్రీ కావాలన్న వరుని చూపుడు వ్రేలూ నాలుగు వ్రేళ్లూ వధువు పట్టుకొన్నాలి. మొదట మగ సంతానము కావాలన్న వరుని బొటన వ్రేలి వధువు పట్టుకొనాలి.

## సప్తపది



అగ్ని హోత్రానికి దక్షిణ ముఖంగా కుడిపాదము ముందు పెట్టి ఉత్తరానికి గాని తూర్పునకు నడచుచు వరుడు వధువుతో నడుస్తూ–

ఒక పాదము – విష్ణువు నీయిష్టానికి నిన్ను అనుసరించుగాక! రెండవ పాదము – ఊర్జవానికి నిన్ను అనుసరించుగాక! మూడవ పాదము – వ్రతానికి విష్ణువు నిన్ననుగ్రహించుగాక! నాల్గవ పాదము– ఆనంద శాంతికి విష్ణువు నిన్ను అనుసరించుగాక! అయిదవ పాదము యింద్రియ పుష్టికి విష్ణువు నిన్నుసరించుగాక! ఆరవ పాదము – ఋతువులకు విష్ణువు నిన్ననుసరించుగాక! ఏడవ పాదము – గృహ హోమ యజ్ఞాలకు విష్ణువు నిన్ననుసరించుగాక!

వరుడు – యీ సప్తపదితో నీవు నాకు అర్థాంగి వగుదువుగాక! మనమిరువురమూ ప్రియులమై వెలుగులీనుదుము గాక!

వివాహము నాటిరాత్రి వధూవరులను యీవలకు తెచ్చి “యీ భూగోళ ధృవము; ఉత్పత్తి ధ్రువము; నీవు ధృవము ధ్రువముగా నుందువు. అరుంధతి సప్తఋషులు కృత్తికలందు ప్రథమముగా యీమె పిలువబడి – సప్త కృత్తికలకూ వాటి కలయికను ముఖ్యముగా నడుపుతుంది. మాకు యీమె ఎనిమిదవది” అని చెప్పాలి.

విద్యారణ్య స్వామి, ఫోన్ : (0883) **2470224**



# వివాహ మంత్రార్థం

వ్యాఖ్యాత :
**శ్రీ విద్యారణ్యస్వామి** (బొత్సకవి)
కంబాల చెఱువు, రాజమండ్రి.

ప్రకాశకులు : ☎ 246 2565
మోహన్ పబ్లికేషన్స్
అజంతా హోటల్ ఎదురుగా,
కోటగుమ్మం, రాజమండ్రి -1
కాపీరైట్ 2003 వెల రూ. 10-00



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

# మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | |
|---|---|
| శ్రీ వినాయక వ్రతం | వెల రూ.5 |
| శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 20 |
| శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 9 |
| లక్ష్మీగణపతి పూజాకల్పం | ... |
| వరలక్ష్మీ వ్రతం | 5 |
| కేదారేశ్వర వ్రతం | 5 |
| త్రినాథ వ్రతం(కలర్) | 5 |
| త్రినాథవ్రతం(సాదా) | 3 |
| క్షీరాబ్ధి వ్రతం | 5 |
| మంగళ గౌరీవ్రతం | 9 |
| వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 15 |
| శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 15 |
| కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 15 |
| సంతోషీమాతా వ్రతం | 15 |
| ఏడు శనివారాల వ్రతం | 15 |
| సత్యనారాయణవ్రతం | 15 |
| శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 15 |
| శివదీక్ష | 9 |
| మార్గశిర లక్ష్మీవారాలవ్రతం | ... |
| శ్రీ వేంకటేశ్వర (దీక్ష) గోవిందమాల | ... |
| కాత్యాయనీ వ్రతం | 15 |
| సౌభాగ్య గౌరీవ్రతం | 15 |
| తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 30 |
| స్త్రీల వ్రతకథలు | 25 |
| స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి(నేదునూరిగంగాధరరావుగారి) | 45 |
| స్త్రీలపాటలు (కామేశ్వరీపాటతో) | 27 |
| సర్వదేవతా పూజావిధానం | 15 |
| ఆరువ్రతాలు | 25 |
| ధన్వంతరీ వ్రతకల్పం | 9 |
| రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 9 |
| పార్వతీ నిత్యపూజ | 9 |
| తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 9 |
| శ్రీ చక్రపూజ | 9 |
| శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 30 |
| శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 30 |
| లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 9 |
| శ్రీలలితా నిత్యపూజ(లలితాసహస్రనామస్తోత్రంతో) | 9 |
| శ్రీ గాయత్రీ నిత్యపూజ | 9 |
| అన్నపూర్ణ నిత్యపూజ | 9 |
| శ్రీ బాలాత్రిపురసుందరీ నిత్యపూజ | 9 |
| శ్రీ సరస్వతీ నిత్యపూజ | 9 |
| మహిషాసుర మర్ధనీపూజ | 9 |
| రాజరాజేశ్వరీ నిత్యపూజ | 9 |
| శ్రీ దుర్గానిత్యపూజ | 9 |
| కాలభైరవ నిత్యపూజ | 9 |
| శివపూజ | 9 |
| వీరభద్ర పూజ | 9 |
| ఆంజనేయ నిత్యపూజ | 9 |
| నాగేంద్ర స్వామి పూజ | 9 |
| సుబ్రహ్మణ్య నిత్యపూజ | 9 |
| రామదేవుని కథ | 9 |
| శివదేవుని కథ | 9 |
| విష్ణుపూజ (విష్ణుసహస్రనామస్తోత్రసహితం) | 9 |
| శ్రీకృష్ణ పూజ, గోపూజ | 9 |
| లక్ష్మీనరసింహపూజ | 9 |
| రాఘవేంద్రపూజ | 9 |
| విశ్వకర్మపూజ | 9 |
| శనైశ్చరపూజ | 9 |
| వేంకటేశ్వరపూజ | 9 |
| బ్రహ్మంగారి నిత్యపూజ | 9 |
| సూర్య నిత్యపూజ | 9 |
| నవగ్రహ నిత్యపూజ | 9 |
| సకలదేవతా అష్టోత్తర శతనామావళీపూజ | 9 |
| పంచాయతన పూజ | 45 |
| రుక్మిణీ కల్యాణం | 15 |
| అష్టనాగపూజ | 30 |
| ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 30 |
| ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 30 |
| ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 30 |
| ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 30 |
| సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 20 |
| పంచముఖ ఆంజనేయనిత్యపూజ | 15 |
| హనుమద్ వ్రతం | 30 |
| 28 వ్రతములు | 99 |
| పూజలు ఎందుకుచేయాలి ? | 30 |
| కలశపూజలు (9ఒకేసారి) | 150 |
| కలశపూజలు (విడివిడిగా) | 150 |
| ఉమామహేశ్వర వ్రతం | 30 |

### 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | |
|---|---|
| శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు | 31 |
| సర్వదేవతా స్తోత్రమంజరి | 99 |
| సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 20 |
| విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 20 |
| లలితా సహస్రనామ స్తోత్రమ్(క్రౌన్) | 30 |
| లలితా సహస్రనామములు | 18 |
| లక్ష్మీ సహస్రనామములు | 18 |
| దుర్గా సహస్రనామములు | 18 |
| ఆంజనేయ సహస్రనామములు | 18 |
| శివ సహస్రనామములు | 18 |
| విష్ణు సహస్రనామములు | 18 |
| గణపతి సహస్రనామములు | 18 |
| సుబ్రహ్మణ్య సహస్రనామములు | 18 |
| గాయత్రి సహస్రనామములు | 18 |
| లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 18 |
| శ్రీరామా సహస్రనామములు | 18 |
| లక్ష్మీనృసింహసహస్రనామములు | 18 |
| సరస్వతి సహస్రనామములు | 18 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.